# అవినీతి

## ( పద్యకావ్యము )



అవినీతిని పారద్రోలండి

తెనాలి

1994 - డిసెంబరు

# అవినీతి

## ( పద్యకావ్యము )

గ్రంథకర్త :
మధురకవి పిడతపర్తి ఎజ్రా
జోస్‌నగర్ [చినరావూరుతోట]
తెనాలి

1994

వెల : రు. 10-00

# అంకితము



రాజపోషకులు

శ్రీ॥ శే॥ రెవ. దావల ప్రసాదరావుగారు B.A.

గుంటూరు

క॥ రాజాధిరాజ రాజా

రాజగుణంబులనుమించు రమ్యగుణాఢ్యా

మోజుగ అంకిత మొసగితి

రాజగు దావల ప్రసాదరావ్ "కవినీతి"న్

# కృతి ప్రశంస

సీ॥ దావలవంశజా! దాక్షిణ్యభావుండ
దాటిపోయితివీవు ధరణినుండి
అడిగిన యర్థికి నర్థంబునిచ్చియు
ఆదుకొనిన 'మేటి' యపరకర్ణ
మంగళకరమగు మంగళసూత్రముల్
దానమొసంగిన దాతవీవు
లేదనుమాటను లేశమైననుగాని
రాపోదు మీనోట రాచబిడ్డ

ఆ॥ రాజకీవిగలిగి రాజాధిరాజుగా
బడుగువర్గమందు ప్రభలినావు
అట్టిమీకు నిట్టి "యవినీతి" కావ్యంబు
అంకితం బొసగితి నాదరమున

ఆ॥ పరులకందనట్టి ప్రతిభచే భాసిల్లి
కదలివెళ్ళినావు కరుణమాని
మాయదారిమిత్తి మనుగడే కూల్చెను
దుఃఖసాగరమున దురపిలంగ

ఆ॥ కొంతకాలముండి కోర్కెలు ఫలియింప
వీలువాలుజూపి వెళ్ళియున్న
మేలుకలిగియుండు మేదిని పేదకు
స్వార్థమెఱుగనట్టి సాత్వికుండ

ఆ॥ మనసు కెలికివేయు మదిలోన మెదలంగ
దైవమెందుకిట్లు తలచినాడొ?
పేదవారలనిన ప్రేమతో వీక్షించి
పేరుగాంచినావు పృథ్వియందు

ఆ॥ తలచుకొనిన గుండె జలదరించు మిగుల
మాటరాదు ఘనుడ నోటివెంట
సమసిపోయె మీదు సత్క్రియాపథములు
సాటి తోటి మేటి నాయకుండ

సీ॥ ఏపనిజేసినన్ ఎంతయో పొందాగ
జరిపింపగలయట్టి సాహసుండ
మకుటులేవు కనగ మాన్యాలులేవాయె
గడనకెక్కితివీవు గుడులునిల్పి
పెండ్లిండ్ల సమయాన పేదలు యాచింప
గుప్పెలివిప్పిన గొప్పవాడ
రాజకీయములందు రాణింపనెంచియు
వెచ్చించియున్నావు విత్తమెంతొ

ఆ॥ బడుగుజాతియందు ప్రభవించియుండియు
రాచబిడ్డవోలె రాణకెక్కి
శ్రీ ప్రసాదరావ చింతలో మమునిల్పి
దూరతీరములకు చేరినావ?

ఉ॥ దేవుని సేవలో మిగుల ధీటుగానిల్పియు రాజకీయమే
ఈవులనిచ్చుమార్గమనినెంచియు శ్రద్ధనుజూపినావు తత్
దేవుని సేవవీడకను దీనజనాంగము నుద్ధరింపగన్
పావనవంశజా! మిగుల ధార్మికబుద్ధితొ సాగినావహో

ఉ॥ ఆంధ్రను చీల్చివేసి మనమందలమెక్కుగ నుద్యమింపగన్
ఆంధ్రను చీల్పరాదనుచు నాగ్రహమొందియు గుండె
నొడ్డగన్
ఆంధ్రులు విస్తుపోయిరి మహాత్ముడ యోగ్యుడ నీదు
గుండెకున్
ఆంధ్రుల పేరునిల్పె నవుడగ్రజనాయక! భారతంబునన్

చ॥ కష్టులను సత్కరించి ఘనకార్యములెన్నియొ సల్పినావు నీ
జవనమునందు జంకక నసాధ్యపు కృత్యపరంపరాళివై
భువికె విరాళమిచ్చిన విభుండవు సాహసవంతుడా మహా
ప్రవిమలశాలియంచు భువి ప్రస్తుతిజేయుచునుండె
నెంతయోన్

ఉ॥ ముంచిరి భోక్తలెల్లమిము ముందుసపాదము మోవకుండగన్
మంచిని వీడి వారు తమ మంచికిమాత్రము విశ్రమింపకన్
వంచనచేసి మిమ్ము బహువంతల పాలొనరించినన్ మహా
మంచితనంబు జూపితివి మాన్యులుమెచ్చగ సత్యసంధుడా

ఆ॥ దుర్వ్యసనములున్న ధూర్తులు దరిజేరి
బ్రతుకుమంటగలిపె పలువిధముల
పిచ్చివాడవయ్య తుచ్ఛుల సలహాలు
నమ్మి చెడితివయ్య నమ్రజీవి

ఆ॥ సహనవంతురాలు సాధ్వియౌ గ్రేసమ్మ
ఆంగ్లభాషలోన అగ్రగామి
పాతివ్రత్యమందు వాసినిగాంచిన
వనిత భార్యయౌట వరముసుమ్మి

ఆ॥ అపర ధర్మరాజు కపటమెఱుగనట్టి
సద్గుణుండు మిగుల సాత్వికుండు
మీదు ప్రథమసుతుడు మేదిని నాయకా
సత్యనందమనెడి సాధుమూర్తి

ఆ॥ చేరియుండువీవు శ్రీయేసుచెంతకు
చిక్కులన్నివీడి చిత్రగతిని
మాకుదారియేది మనుగడసాగింప
నిష్కళంకచిత్త నిర్మలాత్మ

## దాతలకు కృతజ్ఞతలు

ఒక్కొక్కరు ఒక్కొక్క రూపములో పుడమిని అవతరిస్తూ ఉంటారు. ఈ క్రింద నుదహరించిన విశాల స్వభావులను చూడండి. శ్రీమతి గట్టుపల్లి నిర్మలగారు ఆర్ద్ర హృదయురాలు. పరిచయమున్నవారు కష్టాలలో ఉంటే చూస్తూ ఊరుకోరు. అట్టివారికి ఏదో విధంగా సాయపడడం ఆమె నైజము ఆమె మంచివారికి మంచిగాను చెడ్డవారికి చెడ్డగాను కనిపిస్తారు. అర్థం చేసికొంటే ఆమె అమృతమూర్తి. లేకున్న అపరకాళి. అప్పుగా ఐదువందలు తీసికొన్నాను తిరిగి యివ్వబోగా డబ్బులు నేను మిమ్మల్ని అడిగానా ? అక్కర్లేదు అట్టిపెట్టుకోమన్నారు. నాకు మతిపోయింది. సరే ఈ తల్లిపేర అంకితమిచ్చి పేరు చిరస్థాయి చేద్దామని చూచాను. ఆర్థిక చిక్కులో ఉన్నారు. అడగడానికి నోరు రాలేదు. వారిపేరు సాహిత్యపరంగా నిలవడానికి ఈ విధంగా ప్రారంభించి ఒక్కొక్కరిని కలిసికొన్నాను. ఈ కావ్యము అచ్చగుటకు ఈ దాతలే కారకులు.

రెవరెండ్ వై. యం. లూథర్ శాస్త్రిగారిని కలిసికొన్నాను. గుప్పిలి విప్పారు మనసు పండింది. వారికి నా యెడల ఉన్న ప్రేమాభిమానాలు అంతా యింతా కాదు ఒక కవిగానన్ని పట్టణములో ఎంతో ఎత్తుకుఎత్తి చూపారు. ఇది మరువజాలని గౌరవము. డాక్టరు పి. జే, రాజుగారు కాలు ఆపరేషనువలన పరిచయమయ్యారు. విశాల స్వభావులు ముక్కు ముఖము తెలియని వారికి వేలలో డబ్బిచ్చి ఆదుకొనే దయార్ద్ర హృదయులు. అట్టి ఉదారగుణులు యిది మంచి కార్యమని ఎంచి ఆర్థికముగా నన్నాదుకొనిన పుణ్యాత్ములు.

శ్రీ పెనుమాల రాజవర్ధన్‌గారు, శ్రీ కంచర్ల సత్యంగారు, పెన్షను పొందే నాకు అధికారులే. నేను వారి సబార్డినేటునైనా ఎందుకో వారికి నా యెడల పితృవాత్సల్యము తప్ప అన్యము కాన్పించదు. యిద్దరూ యిద్దరే. ఆ చనువుచేత కావ్యము రూపుదాల్చదానికి ఆర్థిక సాయము అడిగిన వెంటనే వారి విరాళమును విరివిగా అందించారు. వీరందరికి పద్య రూపమున నా కృతజ్ఞత తెలుపుకున్నాను. అట్టి దానశీలురకు మరొకమారు నాచేతులెత్తి నమస్సులు చెల్లిస్తున్నాను.

శ్రీమతి గట్టుపల్లి నిర్మలగారు

ఆ॥ గట్టుపల్లి వారి కమనీయ కనకంబు
నిర్మల యనునట్టి నీరజాక్షి
ఒరుల బాధజూచి ఓర్వజాలని తల్లి
పేద ప్రజల పాల పెద్ద దిక్కు

## రెవ వై. యం లూథర్ శాస్త్రిగారు

సీ॥ ఆదర్శమూర్తియై అవనిని యేసయ్య
భక్తుడై ఎదిగిన శక్తిపరుడు
వేదాంత విద్యను విరివిగా పఠియించి
దైవసేవకుడైన ధన్యజీవి
ప్రభువు మార్గమునందు పయనించి నిత్యము
దీవెనల్ పొందిన సేవకుండు
హాస్యంపు మాటల నావంతయైనను
మాట్లాడి ఎఱుగని మాన్యుడతడు

గీ॥ వనిత మరియమ్మ సాధ్విగా తనకు చక్క-
పసిడిముద్దలను గనిన భక్తిపరులు
ఆట్టి పూజ్యులు జకరయ్య ఆదరమున
కలుష రహితుండు శాస్త్రిని కానుకసంగె

ఆ॥ స్వామి మెచ్చినట్టి జాతిరత్నమతడు
దైవజనునికుండు తాల్మిగలదు
ప్రభువు బోధలెంతొ పరవసించునటుల
ప్రజల కందజేయు ప్రతిభశాలి

ఆ॥ మంచిపనుల నెపుడు మన్నించి గుప్పిలి
విప్పి యొసగుచుండు విత్తమెంతొ
వెన్నవంటి మనసుమిన్న గాగల్గియు
ఆదరించు నెప్పుడాదరమున

## డా॥ పి. జె. రాజుగారు (ఫిజయోథెరఫిస్టు)

క॥ వికలాంగు లైనవారలు
అకలంకముగాను సేవలందుచు రాజా!
వికలాంగుల దేవుడవని
సకలజనులు మిమ్ము బొగడ సంతసమాయెన్

## శ్రీ పి. రాజవర్ధన్‌గారు

క॥ సుతులను మించిన సుతుడై
సతతము మదిలోన నిల్చు సౌశీల్యుడహో
మతులెరిగి రాజవర్దన్
హితులకు హితుడై చరించి హితవును బెంచున్

## శ్రీ కంచర్ల సత్యముగారు

ఆ॥ నియమ నిష్టగలిగి నీతిగా వర్తించు
సజ్జనుండెగాదు సాధుమూర్తి
కపట మెఱుగనట్టి కంచర్లసత్యము
ప్రీతి పాత్రుడతడు పేద ప్రజకు

## శ్రీ చిన్నము రామయ్య చౌదరిగారు

క॥ చిన్నము రామయ చౌదరి
వెన్నను మించిన మనసున విజ్ఞత మెలగున్
మన్నన జూపుచు నాపై
కన్న కుమారునిగనెంచి కాంక్షలు దీర్చున్

ఉన్నత పాఠశాలలో వీరు మాకు తెలుగు పండితులు వారు నాకు ప్రియమైన గురుగ్రామిణి వారి చలవే నా యీ అభివృద్ధికి కారణము.

ఎంత సౌమ్యులో చెప్పలేము. గాంధేయవాది-ఖద్దరుతప్ప అన్యముధరించే వారుకాదు. ఆ రోజులలో అస్పృశ్యతా భూతము జడలువిప్పినా చులకన చేసి మమ్ములను ఒక్కమాట అనేవారుకారు. వారు పాఠం చెప్పడం ప్రారంభిస్తే ఆరే పిరియడ్ అప్పుడే అయ్యిందా అనిపించేది. అట్టి మహనీయులను నా కావ్యమును చూచిపెట్టమనగా దయతో అంగీకరించి దిద్దినందుకు వారికి బహుధా కృతజ్ఞుడను. కంటి బాధవలన తిరిగి చదివి వ్రాయ లేకపోయినందున వారి అభిప్రాయము నాకు దక్కలేదు. అదే నాకు తీరని వ్యధ. అటువంటి పూజ్యులను ....

క॥ కలలో గూడను మరువను
విలువగు నా గురువు నెపుడు విమవక గొల్తున్
ఫలముల నీనెడి వృక్షము
తెలుగు పొలంబున అనిశము తీరికలేకన్

---

# ప్రశంస

మధురకవి శ్రీ పిడపర్తి ఎఱ్ఱాకవిగారు వ్రాసిన ఈ పుస్తకంలో నేటి సమాజంలో ఉన్న అవాంఛనీయ పరిస్థితులపట్ల వారికిగల ఆవేదన ప్రస్ఫుటంగా కనిపిస్తున్నది. లోగడ వీరు "ధూమపానం" వల్ల కలిగే అనర్థాలను గురించి మంచి పద్యకావ్యం వ్రాశారు. ఇప్పుడు సులభంగా అందరికీ అర్థమయ్యే శైలిలో కంద పద్యాలలో నేటి సాంఘిక జీవనం లోని దుష్ట సంప్రదాయాలను నిశితంగా విమర్శించారు.

"ఎక్కడ చూచిన మోసము ఎక్కడ వెదకిన నిరాశ" చిక్కులు నిత్యము తలపడి చింతను గూర్చున్ అని ఎఱ్ఱాకవిగారు తమ వేదనను వ్యక్తీకరించారు. "ఉత్తమ పౌరుల కెందున ఉత్తమ పదవుల నొసం

గుట కొప్పుపు మనసుల్" "కలిగిన డాక్టరు, యాక్టరు" కదలదు పలు విధ సుఖముల మరిగియు పట్టణమందున్" అని పల్లెలకు పోవటానికి ఇష్టపడని వైద్యులను విమర్శించడం సముచితమే. "సినిమాలు ప్రజలు కనివినియు నెరుగని ఘోరకార్యములెన్నో" చేస్తున్నారని చెపుతూ సినిమాలవల్ల నేటి యువతరం మనసులు కలుషితం అవుతున్నాయని వ్యధ చెందుతున్నారు. హింసా ప్రవృత్తిని ఖండిస్తూ ''ఆయువు తీయుట సులభము ఆయువు పోయంగ తరమె అధికులకైనన్'' అని కవి చక్కగా చెప్పినారు.

''ముక్తిని బడయంగ గుడుల ముందర'' మ్రొక్కే దొంగభక్తులనూ, ఒంటరిగా సంచరించే పడతులను అవమానించే దుష్టులనూ, అనవసరంగా బందుల జరిపి ప్రజలకు ఇబ్బందులను కలిగించే వ్యక్తులను లాకప్ హత్యలకు కారకులవుతున్న అధికారగణాన్ని బలహీన వర్గాలను అవమానించే పెత్తందార్లను దురహంకారులను. అధికారులను, కులానికి మతానికి ప్రాధాన్యం ఇచ్చే అల్పులను కవిగారు నిశితంగా విమర్శించారు.

''ఇదియేనా మనపోకడ, ఇదియేనా మన ప్రగతి" అనే నేటి సమాజ స్థితికి ఆవేదన పడుతూ హృద్యంగా పద్యాలను రచించిన ''మహాకవి'' జాషువాగారి శిష్యులైన శ్రీ ఎఱ్ఱా కవిగారి నుంచి మరిన్ని ఉత్తమ కావ్యాలు వెలువడాలని నా ఆకాంక్ష.

డా॥ పి. దక్షిణామూర్తి M.D., F.I.C.A.
అధ్యక్షులు : జనచైతన్యవేదిక, తెనాలి.

# పరిచయము

చిరకాల మిత్రులు ఎఱ్ఱాకవిగారి 'అవినీతి' చదివాను. కవి గారి వాక్కు మధురం - వ్రాత మధురం,

లోకసామాన్యంగా జరుగుతున్న అన్యాయాలను అవినీతిని అక్రమాలను చూచి ప్రతిస్పందించి హృదయం నుండి వెలికి వచ్చింది గాబట్టి పుస్తకంలోని ప్రతి పద్యం మనసుకు హత్తుకుపోతుంది.

అయిదారు దశాబ్దులక్రితం కీ॥ శే॥ జాషువాగారి హృదయ స్పందన కవితా రూపంలో గబ్బిలంగా అవతరించి ఆంధ్రదేశాన్ని కుదిపివేసింది.

ఎఱ్ఱా కవిగారు జాషువాగారి బాణీలో పయనించి— లోకసామాన్య విషయాలకు అసామాన్యంగా ప్రతిస్పందించి తన హృదయ గత భావాలను మన ముందుంచారు, అందుకొని రసాస్వాదన చేయగల సహృదయులకు మాత్రం ఆ భావాలు అమృత తుల్యంగా కనపడుతవి,

కల్ల కపటం కాఠిన్యం ఎరుగని కవిగారు లోకంలో ఆ మూడు గుణాలే నిండి వుండడం గమనించి తనదైన బాణిలో సామాన్య పదాలనుపయోగించి అసామాన్యమగు సందేశాలనందించారు

సామాజిక స్పృహతగ్గి వర్గద్వేషం ప్రజ్వరిల్లి మనిషికి మనిషికిమధ్య అడ్డుగోడలు పెరుగుతున్న ఈ రోజుల్లో వయసుపండి అనుభవాలు నిండిన కవిగారి మనసునుండి వచ్చిన ఆక్రందన యీ పుస్తకం,

మనుష్యులంతా వొకచేకాని ఎవరు గీసుకున్న గిరిలో వారుంతాను తప్ప యితరులు పైకిరాగూడదన్న స్వార్థభావంతో తనసుఖంకోసం యితరులు బాధపడతారన్న ఆలోచన లేకుండాచేసే మోసం, దోపిడీ, దౌర్జన్యం ఈ పద్యాలు చదువుతుంటే కనులముందు కనపడుతాయి.

వర్గద్వేషం ఏమాత్రంలేని శ్రీ ఎఱ్ఱాకవిగారిచేత ఈ పద్యాలు రాయించిన పరిస్థితులనుగూర్చి అందరు ఆలోచించాల్సిన సమయం వచ్చింది.

కవిగారు యిలాగే ముందుముందు అనుభూతి ప్రధానమైన కవిత లెన్నో సాహితీలోకాని కందిస్తారని ఆసిస్తాను.

డా॥ రవీంద్రబాబు M. S.

## అభినందన

పిడపర్తి ఎర్రాగారు రచించిన 'అవినీతి' కావ్యమును చదివి ఎంతో ముగ్ధుడనయ్యాను. ఈనాడు సమాజంలో ఎంతో లోతుగా వేళ్ళూనుకొని పోయిన అవినీతిపై వ్రాసినకావ్యము సమాజాన్ని జాగృతంచేస్తుందనడంలో సందేహము లేదు. సామాజిక, ఆర్థిక, రాజకీయ, సాంఘిక, సాహిత్య సాంస్కృతిక రంగాలలో ఇంకా ఎర్రా కవిగారిలాంటి వ్యక్తులు ఉండుట వలనే ఈనాటి మన వ్యవస్థ మనకల్గుతుందనడంలో అతిశయోక్తిలేదు. వీరు మంచి ఆయురారోగ్యాలు కలిగి ముందు ముందు ఇటువంటి సమాజ శ్రేయస్సుకోరే రచనలు చేసే శక్తిని భగవంతుడు ప్రసాదించాలని మనసారాకోరుచూ అభినందించుచున్నాను.

డా॥ వేమూరి శేషగిరిరావు M.B.B.S., D. ORTHO

## స్తవంకాదు - ఇది వాస్తవం

అధర్మం, అన్యాయం, అవినీతి, అక్రమం, అనౌచిత్యం లాంటి ఆకార ప్రారంభకాలు అనేకం మనచుట్టూ ప్రపంచాన్ని పట్టిపీడిస్తున్నాయి వాటిపై పతాకం ఎత్తేవారు వివిధ రంగాల్లో ఉన్నారు. వారిలో కవితా రంగానికి చెందిన మిత్రులు ఎర్రాగారు ఒకరు.

ఎర్రాకవిగారు రచించిన గ్రంథాల్లో ఇది సరికొత్తరూపం సంతరించుకుంది. సరికొత్త నెత్తావులను వెదజల్లుతూవుంది. ఇది ఒక రకంగా కవితా కదంబం. రకరకాల లొసుగుల్నీ, దొసుగుల్నీ ఎండగట్టే యీ కావ్యం ఎర్రాకవి ఎదలోతుల్ని ఎరిగిస్తోంది. ఎచ్చులొచ్చులను ఎత్తి చూపుతూ కలకలం కలిగిస్తోంది ఎర్రా కలం. మానవతను అన్నివైపులా మంటగలిపే సామాజిక స్వభావానికి మూలకందాలైన అంశాలెన్నింటినో కందల అందాలలో పొదిగి, హృద్యపద్యాలలో అనవద్యంగా అభివ్యక్తీక

రింజేసే కవిత ఎ(జాగారి చేతిలో వ(జాయుధంగా కనబడుతోంది. ఇందుక ఏన్నెన్నో చూపవచ్చు. అయినా తినబోయేవారికి రుచి చూపటం ఏందుకు?

ఎ(జా కవితల్లో ఆవేదన. ఆవేశం, ఆలోచనలతో బాటు ఆలోకనం కలగలిపి వున్నాయి విశాల భావుకత్వం నిండి నిబిడీకృతమైంది. "Turning Blood into ink" అనె మాటల్ని సార్ధకం చేస్తూ కవితా (సవంతులను జాలువార్చుతున్న మిత్రుని కృషీవలత్వం నిద్రలోని జనాలను నిర్నిద్రవైపు మళ్ళించాలి, ఆ మేరకు మరికొన్ని కావ్యఖండిక లను వారించి వెలార్చగలదని గుణ(గహణ పారీణులు ఆశించటం సహజం.

పి. అచ్యుతరామ్
గౌరవాధ్యక్షులు. "సాహితీ పద్మ (ప్రభాస"

## పరిచయము

ఎ(జాకవిగారు నాకు చిరపరిచితులు. వారానికొకసారైనా కలుసుకొని మాట్లాడకపోతే మనసుబాగుండదు. అటువంటి కవిగారు సాహిత్యమంటే నాకున్న అభిలాషనుబట్టి ఈకావ్యానికి అభి(ప్రాయము (వాయమని ఇచ్చారు అమూలా(గంగా చదివాను.

అవినీతి అనేది అంతటా వ్యాపించినది. ఏ వృత్తికావృత్తి నిశి తంగా పరిశీలిస్తే అవినీతనేది తన పొరుగువానికి ఎంత హానికలిగిస్తుందో చెప్పనక్కరలేదు, పూర్వము యేసు(క్రీస్తువద్దకు వ్యభిచారిని యీడ్చుకొని వచ్చి యీమెను ధర్మశాస్త్రం ప్రకారం చంపాలా వద్దా అని అడిగితే అందుకు ఆయన మీలో పాపము లేనివాడు ముందు ఆమెమీద రాయి వేయమన్నాడు. ఎవడికివాడు వెనుదిరిగిచూచి రాయి అవతలపారవేసి జారుకున్నారు.

కాన ఎవరికివారు అవినీతి కార్యములుమాని స్వచ్ఛందంగా (బతి కిన దేశము సుభిక్షంగా ఉంటుంది. అన్ని శాఖలలోని అవినీతిని దండె

పట్టిచూపారు. అందలి ఆవేదన వర్ణనాతీతము. ఏ పద్యానికా పద్యము హృద్యంగా మలిచారు. అటువంటి అనుభూతి సమాజములో రావాలంటే నీతిదాయకమైన కథలు చరిత్రలు పాఠశాల దశనుండే నూరిపోయాలి. ఆవిధంగా కృషిసల్పిన సమాజమును కొంతవరకు సరిదిద్ద వచ్చునని నా అభిప్రాయము.

ఇటువంటి ఘోరకృత్యములు కండ్లఎదుట జరుగుచున్నను చల నములేని ప్రభుత్వములు పట్టనట్లున్నవి. ప్రభుత్వాలు అక్రమాలను గమ నించి సరియైన చర్యతీసికొనిన అవినీతి అణచివేయవచ్చును. అటువంటి సమాజము ప్రభుత్వమును సరిదిద్దగలదు.

ఇటువంటి పద్యకావ్యము సమాజము శ్రేయస్సుకు అందించిన మధురకవి ఎఱ్ఱాగారు అభినందనీయులు. దైవము వీరికి పరిపూర్ణ ఆరో గ్యము ననుగ్రహించి సమాజశ్రేయస్సుకు మరికొన్ని మంచి కావ్యముల నందించ శక్తి ననుగ్రహింప భగవంతునికి నా ప్రార్థన.

2-12-94  తాడికొండ కృష్ణమూర్తి

తెనాలి అడ్వొకేట్

## కృతజ్ఞత

వయసు మళ్ళింది శక్తి ఉడిగింది. ఇటువంటి స్థితిలో సత్కావ్యా లందించాలి అంటే ఆర్థిక పుష్టి ఉండాలి. అది లేకనే ఇటీవల యిద్దరు ఘనత వహించిన బడాఆఫీసర్లను ఆశ్రయింపగా నమ్మకద్రోహంచేసిజారు కున్నారు. అందువలన నేను పడిన ఆర్థిక యిబ్బంది అంతా యింతా కాదు. ఇటువంటి సంకట పరిస్థితులలో ఈ కావ్యాన్ని అచ్చువేయడానికి చేసిన ప్రయత్నమును వివరించాను సరేఅంకితము గైకొనుటకు మచ్చలేని వ్యక్తి కావాలి.అటువంటివ్యక్తికిఅంకితమీయ సంకల్పించి గజిటెడ్ ఇన్స్పెక్టర్గా పనిచేసి రిటైరు అయిన శ్రీ వి. బాలవెంకటేశ్వర్లుగారికి విజ్ఞప్తి చేయగా వారు తమ అశక్తతను చూపారు. ఎందుకంటే

క॥ ముట్టరు లంచములన్నను
గిట్టదు లంచముల బ్రతుకు కీలకమేమో
పట్టుట కొప్పరు ధనమును
కట్టలు కట్టలుగ యింటి గడపను ద్రొక్కన్

అటువంటి నిష్కళంకులను యిబ్బంది పెట్టుట మంచిది కాదని రాజకీయాలలో దిగి బహునీతిగా మెలిగి సర్వము పోగొట్టుకొనిన శ్రీ దావల ప్రసాదరావుగారు అర్హులని వారికి అంకిత మిచ్చాను. పూజ్యనాయకురాలు శ్రీమతి ఇందిరాగాంధీతో పరిచయమున్న బడా నాయకుడు. కాని పూచిక పుల్ల కూడా లంచంగా ముట్టుకోలేదు అందుకే వారికంకితమిచ్చాను.

"సహృదయ" ఈచక్కని పదము డా॥ పాటిబండ్ల దక్షిణామూర్తి గారి ఇంటి ప్రాంగణములో ప్రవేశించేముందు రాతి పలకములో యిముడ్చబడియుండి ప్రతి ఒక్కరికి దర్శనమిస్తుంది. ఇది వారికి వారి చికిత్సాలయమునకు సార్థక నామము. డాక్టరుగారికుండవలసిన సహృదయము, దయ, శౌచము, దాక్షిణ్యములు పుష్కలంగా ఉన్నాయి. అట్టి సద్గుణవంతులు సాహిత్యాభిమానులు కావడము కవుల అదృష్టము. అందుకే వారు మాకు కొండంత అండ. ఒక మని మాపున ఈ కావ్యమునకు అభిప్రాయము వ్రాసిమ్మని కోరగా అమితానందముగైకొని వారి అమూల్యాభిప్రాయము వ్రాసి యిచ్చినందుకు వారికి నా సహస్ర సుమాంజలులు.

ఇటీవల వెలువడిన ధూమపానమను కావ్యమునకు అభిప్రాయము వ్రాయించాలని డా॥ కొత్త రవీంద్రబాబుగారింటికి పలుమారు తిరిగాను. వారు గ్రామాంతరము వెళినందున వారి పరిచయ వాక్కులునాకు దక్కలేదు. దీనికైనా తమ అభిప్రాయము వ్రాసిమ్మని నిషురమాడగా సరే యిప్పుడే యివ్వ ముందే వ్రాసియిస్తానని వ్రాతప్రతిని తీసికొని ఎప్పుడో వ్రాసి యిచ్చిన వారి అభిమానమునకు నా జేజేలు. అట్టి పూజ్యుని అభిప్రాయము నా కావ్యములో చోటు చేసికొనుట మహదానందము. వారి కొరకు ఎప్పుడు వెళ్ళినా ఆహ్వానించి కమ్మని కాఫీ తెప్పించి ప్రక్కన కూర్చుని నాతో త్రాగిగాని సెలవు యివ్వరు, అట్టి పూజ్యులు నాకుదక్కుట నా అదృష్టము. వారికి నా కృతజ్ఞతాంజలులు.

శ్రీ గేరా ప్రకాశరావు గారు ఏర్పరచిన సభలో డా॥ వేమూరి శ్రీమన్ గిరిరావుగారి పరిచయ భాగ్యము కలిగినది. మంచి సాహిత్యాభిమానులు 1993 లో కాలు దెబ్బతిన్నా నన్ను మా పిల్లలు తెలియని రీతిగావారి హాస్పిటలులో చేర్చగా డా॥ రావుగారుచూచి అరే మా గురువుగారేనని బాధపడి ప్రథమ చికిత్సచేసి గుంటూరు గవర్నమెంటు హాస్పటలు డా॥ భాస్కరరావు గారి కప్పగించి నన్ను నిలబెట్టిన ప్రాణదాత. అప్పటినుండి మా అనుబంధము విడదీయరానిదైనది. పితృతుల్యుని భావించి నన్నాదుకొను డా॥ రావుగారి ప్రేమ మరువలేను. అట్టి మహాశయులను తమ అభిప్రాయము వ్రాసిమ్మనగా వెను వెంటనే వ్రాసి యిచ్చిన పూజ్య భిషగర్వులకు నా కృతజ్ఞతలు.

కులము, వర్ణము, నీ-నా అనే తారతమ్యమును తుంగలో త్రొక్కి సర్వము సమానమనే విశాల స్వభావులు ప్రముఖ లాయరు శ్రీ శాడికొండ కృష్ణమూర్తి గారు. నిష్కళంకచిత్తులు. నా రచనలంటే అభిమానించే ఆప్తులు. పేదలంటే నిత్యము వారి గురించి ఆలోచించి వ్యధచెందు దయార్ద్ర హృదయులు. అట్టి గుణ గణాద్యులను తమ అభిప్రాయమును వ్రాసిమ్మనగా దయతో అంగీకరించి వ్రాసియిచ్చినందుకు వారికి నా కృతజ్ఞతలు

గ్రంథాలయమే తాను తానే గ్రంథాలయముగా భాసిల్లు శ్రీ పరుచూరి అచ్యుత్ రామ్‌గారు చిరపరిచితులు. నేను వారింటికి వెళ్ళినపుడు సలిపిరిచే సిరసంచి ఎక్కడో లోతున మాట్లాడుతూ "ఏదో పనిమీద వచ్చారే" అని అనగానే నా కావ్యానికి మీ అభిప్రాయము కావలసి వచ్చాననగా ఆయాసపడుతూ నేను కూర్చోలేను నిలబడలేను. అయినా చదివి ఎవరి చేతనైనా వ్రాయించి యిస్తానని అంత బాధలోఉండి ఎలా వ్రాశారో ముత్యాలలాంటి అక్షరాలతో పొదిగిన అక్షరమాలను నాకందించగా అబ్బుర

పడి బహుగాకొనియాడాను. సాహిత్యమంటే వారికెంత ఆశక్తో నాకర్థమై పొంగిపోయాను అట్టి సరస్వతీనందనునికి నా ఎనలేని కృతజ్ఞతలు ఆ బాధలో వారికి అనుమానమువేసి "ఎగ్రాగారు" అని సంబోధించి మీ ముఖము మరలా చూస్తానో లేదోనసే సరికి నాకు కళ్ళనీళ్ళపర్యంతమైనది. దైవము వారికి సంపూర్ణ ఆరోగ్యము అనుగ్రహించ ప్రార్థన.

## వేదన

క॥ తిండికి గింజలు కటకట
వండగ పప్పులు దొరకవు పాపంబేమో!
మండిన ధరలలొ బ్రతుకులు
గండములాయెను ప్రజలకు కడు ఘోరతతిన్

అవినీతి వలన అధికధరలు అధికధరలవలన ఆకలి అలమటింపులు స్వార్థపరులు సరుకు దాచి కృత్రిమలోపము సృష్టించి పేదల పొట్టలుకొట్టడము న్యాయమేనా! అధికారులు వ్యాపారులు దయతలిస్తేగాని ప్రభుత్వము గుక్కత్రిప్పుకోలేదు, అందువలన గమనించండి

## తప్పొప్పులు

| పేజీ | పద్యము | లైను | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 17 | 3 | 2 | భూవి | భువి |
| 28 | 3 | 4 | బ్రాయ | ప్రాయ |
| 11 | 4 | 4 | నిశి | నశి |
| 25 | 4 | 2 | చుందురే | చుందుర్ |
| 31 | 2 | 3 | తప్పున్ | తప్పన్ |
| 32 | 3 | 1 | గుంజి | గుంజిన |

# అవినీతి

## పూర్వము

కll ధరణిని పూర్వము భారతి
పరమ పవిత్రముగనుండె పలువురి దృష్టిన్
పురువని భక్తి ప్రపత్తుల
తరిగెను ఘోరముగ నేడు తద్భక్తిగనన్

## పచ్చిదోపిడి

కll మోసము తెచ్చుటజూచిన
మోసము పరవళ్లు త్రొక్కి ముప్పును గూర్చెన్
మోసము లేనిదె బ్రతుకులు
వీసము ముందుకు జరుగక వింతను గొల్పెన్

కll సర్వము కత్తిల మయము
గర్వము కలిగించునట్టి కార్యము గలదా ?
దుర్విధి పైబడి ప్రజలను
నిర్విణ్ణులనుగ నొనర్చె నిత్యము సొగున్

కll కనగను బియ్యము పప్పులు
వినిమయ వస్తువుల ధరలు వింతగ మార్చెన్
వినయము జూపుచు మెలగుచు
కనులను గప్పి యొనరింత్రు కత్తీలెన్నో

క॥ రంగుకు చాలిన హంగులు
అంగడియందు న మరుగున ననువుగ నుంచున్
అంగడి వారలె కలుపుదు
ఇంగితమును వీడినిత్యమివ్విధి సరుకున్

క॥ అడిగిన పైకము నిచ్చిన
మిడిమేలపు కాపునీరు మిగులం గలుపున్
పిడితెడు పాలలోగూడను
కడివెడు నీరమును గల్పు కరుణయెలేకన్

క॥ ఎరువుల యందు న బూడిద
అరమరలేక కలుపంగ నరకౌరపంటల్
కరువుకు మూలము కల్తీ
మరణాలకు మూలమాయె మండినకల్తీ

క॥ చక్కెర యందున రవ్వను
చక్కగ మిళితమొనరించి చంచలబుద్ధుల్
టక్కరి చేయుచునుండిరి
మ్రొక్కులు మ్రొక్కుచును దైవమునకు న్నీచుల్

క॥ పప్పుకు రంగును కలిపియు
ముప్పును గూర్చుచు ప్రజలను ముంతురు సతతమున్
తప్పట లేదాయె ప్రజకు
తప్పుడు సరకుల బెడదలు తద్దిన మగుచున్

క॥ ప్రజలేమైతే నేమని
కుజనులు తలపరు ధనమును కూర్చుకొనంగన్
కుజనులు చేసెడి పనులకు
ప్రజలిట మాడి మసియైన ప్రభుతకులెక్కా

క॥ కల్తీమాత్రలు మ్రింగుచు
శాల్తీలే జారిపోవు సంగతు లుండెన్
కల్తీలేనట్టి సరుకు
కల్తీ భక్తులకు లోటుకలుగదు మనలోన్

క॥ వినయాన సాగు వణిజులు
కనులనుగప్పి కలుపుదురు కల్తీలెన్నో
ధనికుల యాశలు ప్రజలను
కొనయూపిరితోడ నింపి గోడును బుచ్చెన్

క॥ నప్పుల దినుసులు కల్తీ
కప్పురమున తెలియనట్టి కల్తీ యుండున్
ముప్పును గూర్చెడి కల్తీ
ఒప్పున? దైవమ్ము లేడె యుర్విని వణిజా?

క॥ జలమును కలుపును పాలలొ
కలుషము చేయబడు పెరుగు కల్తీతోడన్
విలువగు వెన్నలొ పిండిని
కలుపుచు చేయుదురు కల్తీ కఠినపుచిత్తుల్

క॥ లోకుల నెత్తిన చేతులు
కాకుల చందమున బెట్టి బ్రతుకుట తగునా?
లోకుల రక్తము జుర్రుట
లోకము మెచ్చదు దగాను లోభము మురుచున్

క॥ తికమక పెట్టెడి వణిజులు
తకరారు కృత్యములుగాంచి దానవులైనన్
వికలము జెందుట తప్పదు
సకలము కల్తీలతోడ సాగుచునుండన్

క॥ పావని తెచ్చిన విషమును
చావగ దిగమ్రింగ దాని సాయము మానెన్
చావుకు తెగబడి మ్రింగగ
చావే భయపడియు దాగె చలనములేకన్

క॥ తప్పుడు తూకము తూచెడి
తప్పుడు జాతికిక ముప్పుతప్పదు సుమ్మీ !
ఒప్పదు దైవము నీచము
తప్పును గ్రహియించి జాతి తరలకయున్నన్

క॥ తూకము ధరలో మోసము
ఏకముగనుసాగె నీచ మెంతయొ నెలమిన్
ఆకలి తీరదు లోభికి
ఊకలికాలమున ఆస్తి నెత్తుగ బెంచన్

క॥ విత్తము జారక ముందర
చిత్తము నొప్పగ వణిజుడు చెలువము నెఱపున్
విత్తము చేతికి చిక్కగ
చిత్తము వచ్చిన పగిదిని చిరబురలాడున్

క॥ చేతికి చిక్కిన పైకము
ఆతనిచేతి కడనుండి అందదు సుమ్మీ !
హేతువు చూపించి యడుగ
చేతులు కలుపంగ చూడ చిత్రము గలుగున్

క॥ అవమాన మెంతయొ గలుగ
జవములు జీవములు క్రుంగి పొంతము క్రుంగున్
వివరము విడి మాటాడుచు
అవహేళనకు గురియైతిననుచు దిగులుతొ కదులున్

క॥ ధరలు పడిపోయిన యెడల
దొరలకు నెనలేని సెగలు దొడ్డగ రేగున్
కరువుల యూబిలొ చిక్కిన
నిరుపేద ప్రజలను గాంచి నెనరున గనునా ?

క॥ "అయసు అయి" యనెడి ముద్రను
అయువారలు పొందు నాణ్యతం దింపంగన్
భయ మేమియు లేక సరుకు
దయనీయముగాను మార్చు తస్కర జాతుల్

క॥ బూటకము దప్ప సత్యము
నాటకముగమారె నేడు నాగరికులకున్
నీటుగ నుండు బ్లేడులు
మోటుగ తెగుచుండు నవియు మోసమువలనన్

క॥ ఎక్కడ జూచిన మోసము
ఎక్కడ వెదకిన నిరాశ యెంతయొ కలుగున్
ఉక్కిరి బిక్కిరి చేసెడు
చిక్కులు నిత్యము తలపడి చింతను గూర్చున్

క॥ కూటికి మాడెడి కొందరు
కోటికి పడగలనునెత్తి కులికెడి భోగుల్
ఏటికి మోసపు టెత్తులు
కాటికి చనునట్టివేళ కనకము చనునా ?

## లంచములు

క॥ మిగులుగ కాగితము కదల
తగిన బరువు మోపకున్న తరలకయున్నె ?
తగు మోతాదులో బరువును
వగవక మోపిన పనులిక పరువము జెందున్

క॥ బరువును మోపకయున్నను
తిరుగుట తప్పదు గురునకు దినపుల కొలదిన్
జరుగుట ఖాయము; రోజుల
తరబడి తిరుగంగవలెను దండుగ పడచున్

క॥ లంచము ముట్టని శాఖల
నించుకయైన కనజాల మెచ్చొటైనన్
ఎంచరు మంచిచెడుగులను
ముంచగ జూచెదరు తుదకు ముష్కరజాతుల్

క॥ మంచిగ 'టెండరు' పాడిన
వంచకుడెన్నో దగాగ పనులన్ చేయున్
మంచిగ చేయరు పనులను
కొంచెపుటింజి నియరులిక కొట్లు గడింపన్

క॥ అందరు పంచుకొనంగను
పందలొ నాలుగవవంతు పనులే జరుగున్
కొందరు నీతిగ నుందురు
కొందరు పెడదారులందు కోట్లు గడింతుర్

క॥ విలువగు సొమ్మును దోచెడి
బలిసిన కులజునకు శిక్షపడుటే సున్నా !
అలుసుగ కనబడు వానికి
పలురీతుల శిక్షవేసి బాధింతు రిలన్

క॥ గతిలేని పేదవారల
వెతలను పరిమార్చునట్టి విబుధులు సున్నా !
మతిలో తలపరు పేదను
సతతము సంపదలు బెంచి సౌఖ్యము బొందన్

క॥ కోట్లను కూర్చుచు కొందరు
కోట్లకు పడగలనునెత్తి కులుకుచునుందుర్
"సీట్లను" పొందిన కొందరు
కోట్లను మ్రింగుచు సుఖాల కొలువులా తేలున్

క॥ నాయక రూపము దాల్చియు
హేయముగ నటనను సల్పి హీనులు వెలసెన్
మాయలు మర్మము తోడను
హాయిని పరిమార్చు టెంతొ హైన్యముసుమ్మీ !

క॥ దోపిడి చేయుచు ప్రజలను
చూపింతురు ట్రిక్కులెన్నొ చోద్యము జెందన్
ఏపుగ నేతలు పలుకుచు
దోపిడి చేయగ వెరువరు ధూర్తత్వమునన్

క॥ లెక్కకుమించిన ఆస్తులు
ఎక్కడ జూచిననుగాని యెన్నియొ నుండున్
మక్కువ జూపరు పెద్దలు
చిక్కిన పేదల బ్రతుకుల చిక్కులు మాన్పన్

క॥ కట్టిరి భవనము లెన్నో
గుట్టుగ పట్టణములందు గొప్పగనేతల్
బెట్టుగ మెలగుచు నుందురు
చట్టమునకు చిక్కకెంతొ చతురత తోడన్

క॥ గుట్టుగ కవరులొ పెట్టిన
కట్టలు ముట్టగ ప్రభువులు కలవారలకే
దిట్టమగు పదవు లిత్తురు
బెట్టుగ బ్రతక గలవారు పేదకు పమమా ?

క॥ నిజుపేద వారికెన్నో
తరుగని ననువగు పదవులు దండిగ నున్నన్
కరుణను జూపియు ప్రభువులు
బిరబిరవేయగ చొఱవను బెంచరుసుమ్మీ !

క॥ నింపిన పదవుల యందున
ఎంపికయైన మహనీయు లించుకయైనన్
తెంపరి తనమును జూపరు
ఎంపిక చేసిననుగాడ ఎఱుగని రీతిన్

క॥ దగ్గర వారికి మాత్రము
అగ్గల ముగనిచ్చుచుంద్రు రధికారాలన్
దగ్గర దూరము లెంచక
మొగ్గును జూపెదరు పైడిమాటల నీయన్

క॥ ఉత్తమ పౌరులకెందున
ఉత్తమ పదవుల నొసగుట కొప్పవు మనసుల్
విత్తర గాంద్రకు మాత్రము
ఉత్తమ పదవుల నొసంగుదురున్నతు లెల్లన్

క॥ లంచము తీయనివానికి
మంచిగ పనిచేయబోరు మంత్రులుకూడన్
అంచలుగ నీ పిశాచము
పంచనని వ్యాధిని బెంచె బహునీచముగన్

క॥ ఉన్నత కులముల వైద్యుల
నెన్నిక చేయగను వైద్యులెదురైరాగా
ఉన్నత వైద్యుల పదవుల
నెన్నిన తీరునకు విజ్ఞలెంత వగచిరో

క॥ కలిగిన డాక్టరు యాక్టరు
పలెపట్టున నుండి చేయు బహుబాధపడున్
కలిమిబలంబున కదలడు
పలువిధ సుఖముల మరిగియు పట్టణమందున్

క॥ కలిగిన వారలు "క్యూలో":
నిలబడి పేదలకు సద్దు నిలబడనేలా ?
కలిమితొ నిండిన వారలు
విలువగ బ్రతుకంగవచ్చు విత్తముతోడన్

క॥ పల్లెలకు వెళ్ళ పేదలు
పల్లెయనుచు తమ సుఖుఖత ప్రకటింపంగన్
పల్లగవారిని వాదని
పెల్లుగ దండుకొను ధనము భీతియె లేకన్

క॥ పెద్దలు చెప్పెడి మాటలు
చద్దితా సమమందు రెపుడు సజ్జన పురుషుల్
సుద్దులు చెప్పెడి పెద్దలు
బుద్ధిగ మెలగుటయె కల్లపుడమిని కనగన్

క॥ ఏమియు నెఱుగని రీతిని
క్షేమము నెఱుగని ప్రభువులు వినిపెదరు వృథా
తాముటు చేసిన పనులకు
ఏమియు చింతపడరాయె ఈనాటిఘనుల్

క॥ పల్లెల యందున వైద్యుల
కొల్లగ వేయగను వారు గొణుగుచు తొలగున్
పల్లెకు వేసిన వైద్యులు
కల్లలు చెప్పియు తొలగుట కడువింతసుమా॥

క॥ చెప్పుడు మాటలు వినియెడి
తప్పుడు పెద్దలతొ ముప్పు తప్పదు సుమ్మీ!
చెప్పిన వేగిర పడకయు
తప్పును దిద్దియు కదలిన ధర్మము నెగ్గున్

క॥ కలిమితొ తులతూగు ప్రజలు
తెలివిగ వర్తించుచుంద్రు దిగులే లేకన్
పలు తరముల సంతానము
విలువగ బ్రతుకంగ వచ్చు విత్తము తోడన్

క॥ పెంచిన జీతము పొందగ
లంచము లీయవలె వారు లబ్ధిని పొందన్
పెంచిన ప్రతిసారియు నిటు
లంచము గొనుతెరువులెల్ల లౌకికమేనా?

క॥ పేదల పొట్టలు గొట్టుచు
గాదెలో పందికొకులవలె గావు కొనంగన్
వాదములాడిన ముప్పని
సోదరు లిచ్చెదరు డబ్బు స్రుక్కుచునైనన్

## బస్సులవారి తీరు

కII కాసులు చెల్లించ బసులో
పైసలు తిరిగిచ్చు ధర్మ పరులన్ గానన్
పైసలు తిత్తి లోనున్నను
పీసము తొణకడు మిగిలిన విత్తము నీయన్

కII కొందరు నీతికి నిలబడి
తొందరపడకుండ సర్ది దొడ్డగ నుందుర్
నిందకు పాత్రులు పట్టణ
మందున బసులను నడుపు మహాత్ములు మిగులన్

## సినిమాలు

కII సినిమాలు చూచుటవెల్లై
వినయ విధేయతలుతగ్గ వికలతపెరిగెన్
అనయము వెట్టిగ సాగగ
వినయము భక్తియు నశించె వేయివిధములన్

కII సినిమాలు చూచిన ప్రజలు
కనివినియు నెఱుగని ఘోర కార్యములెన్నో
దినదినము సల్పు చుండగ
మనగలమా ? మనసు చెడ్డ మనుజులమధ్యన్

# నిబంధనలకు నీళ్ళు

క॥ రోడ్డున కడ్డము నిలబడి
ఎడ్డెగ చరియించెడి ఘనులెందరు గలరో
గడ్డుగ మారును "ట్రాఫికు"
చెడ్డగ మధ్యను నిలబడ చీదర గలుగున్

క॥ సైకిలు మోటరు బండుల
పోకడ గాంచియునుగూడ బుద్ధియె లేకన్
మూకలు గుంపుగ రోడ్డున
ఏకముగను సాగు చంద్రు విజ్ఞతలేకన్

క॥ సహనము గలిగియు వెడలెడి
సహచరులకునియ్య దెంతో సంకటముసుమా!
మహనీయులు దారీయక
అహమున జనుచుండు టెంతో అబ్బురముసుమా!

క॥ బరువుతో లారీలు బసులు
తరుముచు వచ్చుట సహజము తరుగనిరీతిన్
వెరువక రోడ్డున నడచిన
మరణము తప్పదు నరులకు మార్గముమధ్యన్

# ధూర్తులు

క॥ జగడము జరిగిన చాలును
పగరుచు పరుగులిడుచుండ్రు వైరము పెంచన్
పగసాధింపగ నీచులు
ఎగబడి కత్తులను దూసి ఏర్తురు ప్రజలన్

క॥ మాటలతో పని లేదిక
వేటగు కత్తులను బూని తెగటార్పంగన్
సూటిగ పొగుదు రంతట
మాటుగ కలహములు రేగి కలవరపరచున్

క॥ వచ్చినవానికి చూపిరి
చిచ్చియతడు నిలువగలడ? ఈ భువిలోనన్
కుచ్చితపు జాతి ప్రజలను
మెచ్చరు మూర్ఖులనుగూడ మ్రింగుడు పడకన్

క॥ ఆయువు తీసిన మీదట
నేయుగ మందైన కాంచనెవనికి తరమా?
ఆయువు తీయుట సులభము
ఆయువు పోయంగ తరమె అధికులకైనన్

# ద్రోహులు

క॥ ఏపుగ మాటలు బలుకుచు
మోపుగ మోసములుజేయు మూఢత వెలసెన్
"రేపులు" మోపుగ హెచ్చెను
చూపుల తూపులు విసరుచు చోరులు మిగులన్

క॥ పడతులు ఒంటరిపాటున
గడుపుట కష్టము నిజముగ కఠినుల మధ్యన్
కడలిని దాటుట సులభము
గడపను దాటుట యువిదకు గండము సుమ్మీ

క॥ ఒంటరిగా నాడబడుచు
ఇంటి గడప దాటిచనిన ఎటుగానైనన్
తుంటరిమూకలు పైబడి
కంటక ప్రాయముగజేసి కడలిని ముంచున్

క॥ ఆశలు రాసులుగ పెరిగి
దిశలను తలక్రిందుచేయు దినములు వచ్చెన్
ఆశలు నాశన పథములు
ఆశలు నశియింపకున్న అవనే మునుగున్

క॥ మెడలో నగలను దాల్చిన
పెడగా కనిపెట్టి దొంగ వింతగ దోచున్
గడపను దాటిన చాలును
వడిగా వెంటాడి వాడు ప్రాణము తీయున్

క॥ తరుణము మించునని బలికి
వెరవులు చూపుచు ఘరాన వీరులు భువిన్
అరమరలేకను ధనమును
తిరముగ "చిట్‌ఫండు" పేర దిగమ్రింగుటగున్

క॥ భక్తికి కొదువేయుండదు
ముక్తిని బడయంగ గుడుల ముందర మ్రొక్కన్
శక్తికొలదిని జరుపుదురు
యుక్తిగ హత్యలు దగా కుయుక్తులికెన్నో

క॥ భజనలు చేయుచు నిత్యము
గజదొంగలు సైతమెంతొ గౌరవమొందన్
నిజమును గుర్తింపని ప్రజ
కుజనులకే మ్రొక్కుచుంద్రు గుండెలు పిండన్

కll బసులో పయనింప భయము
ఇసుమంతయు తెలియకుండ నెక్కెడి దొంగల్
బసుసాగిన మీదట యిక
గుసగుసలాడుచు ప్రజలను గుట్టుగ దోతుర్

## బందులు

కll మింటి కెగసిన ధరలతో
కంటికి కఱువాయె నిదుర కలతల చేతన్
మంటలు రేపెడి ఆకలి
కంటక ప్రాయముగనుండు గడపగ దినముల్

కll ధర తగ్గినచో బందులు
ధర పెరిగిన పేదజాతి దైన్యము చూపున్
కరవమనినచో కప్పకు
కరవకుమనిచెప్ప ఫణికి కంటుగ నుండున్

కll బందులు చిందుల తోడను
డెంద ముకుందుచు జనములు డీలాపడగన్
గందరగోళము తేర్పడ
చిందర వందరగ బ్రతుకు చిచ్చగు చుండెన్

క॥ కదలిన బందుల బెడదలు
మెనలిన హత్యలు చికాకు మెలగుటు ఎట్లో
వదలని బందులు పైబడి
యెదలో ముండ్లగుచు మాటి ఇంగలు ములగున్

క॥ బందులు జరిపిన నష్టము
వందలు వేలలొ జరుగును పాలనయందున్
ఎందుకు జాప్యము చేయుట
ఎందులకీ బాధ లెందుకీ మొగమాటల్

క॥ యోచన చేయరు ముందుగ
దోచెడి బుద్ధులతొ మిగుల ధూర్తత్వముతోన్
దాచిన దాగని సత్యము
ఈ చలనములేని ప్రభువు లెంచరు కుమతిన్

క॥ ఏలిక చక్కగ మెలగిన
చీలికలు జరుగుటకల్ల చేసెడి పనిలోన్
మేలులు కూర్చక ప్రభువులు
జాలము చేయుదురు పనులు చతికెల పడగన్

క॥ లోసుగులు దొర్లిన యాతకీ
విసుగక యధికారులు వెనువెంటనె పనులన్
రసబస చేయక సల్పిన
అసమానతలు దిగజారి అల్లరులణగున్

క॥ సమ్మెలు సాగకయుండిన
కమ్మగసాగును రథంబు గమ్యముచేరన్
తిమ్మివి బమ్మిని చేయగ
ఇమ్మగు పరిపాలనంబు లిడుములపాలౌ !

క॥ రోగము నొప్పులు వచ్చిన
వేగమె పట్నమునుజేర వీలే లేకన్
రోగికి దారులు మృగ్యము
సాగను విలవిలలుతప్ప కలుగవు సుఖముల్

క॥ అజ పలుకవలెను కోర్టులో
ప్రజలటు తప్పనిసరిగను బాధలు పడుచున్
ప్రజలకు హానిని గూర్చె, డ
పజయు పనులను తలపంగ బాధగ నుండున్

క॥ కనలిన ప్రతి'పార్టి' ఘనుడు
మొనగాడి తనంబుజూప మూకలుగట్టున్
దినదినము సమ్మె చేయుచు
మనుజుల నిర్వ్యధిని కాలమున్ముట్టతగునా ?

క॥ బందులు చెలరేగ ప్రజలు
కుందుచు తమ వ్రాతకై యుఘోరింపక యే
మందురు? పేద తనంబున
బందులు ప్రాణములుతీయు ఫలితము సున్నా !

క॥ బదవలు పడకుండ జనులు
అధికులకునుగూడ చూడనబ్బవు సుఖముల్
హృదయము కాల్చెడి పనులివి
అధమస్తపు పాలన ప్రజ నణచగ జూచున్

క॥ పరిపాలకు డన నడిగిన
ఫలముల తృప్తిగ నొసంగు ప్రభువే ప్రభువౌ!
కలమాన్నము లేకున్నను
ఫలహారములీయ చాలు బ్రతుకగ జనముల్

క॥ స్వార్థము బలిసిన మనుజుడు
వ్యర్థపుమాటలు బలుకుచు బాధాతప్తున్
దుర్దశ కీడ్చును - బాధను
అర్థము చేసికొని మెలఁగ నాశలు చంపున్

క॥ తినుటకు తిండిని బెట్టుచు
పెనుబాములు బాపుచు కడు విజ్ఞతతోడన్
మనుటకు కూడును గుడ్డయు
అనయము కూర్చినసుజాలు నల్పుఁబైనన్

## ర క్ష క భ టు లు

క॥ రక్షకభటు లుందురు మన
కక్షయబాణములవోలె నద్భుతరీతిన్
భక్షణ మొదలిడి పిమ్మట
మోక్షము దక్కక నరకమె ముందుగ పొందున్

క॥ నందిని పందిని చేసెడి
వందులు నిజముగను పెద్ద ప్రజ్ఞాశాలుల్
మందమతులుకారు నిజము
ఎందున దాఁగినను దొంగ నెత్తియు చూపున్

క॥ చోరపతా రక్షణ కూర్పగ
తరలెడి రక్షక భటులకు దైత్యుల బెడదల్
తరుగని రీతిగ తలపడ
వెరవులు మృగ్యముగనుండి వింతలు గొల్పన్

క॥ 'లాకపు' చావులు పెరిగెను
మూకల హత్యలు పెరుగుట ముమ్మరమాయెన్
లోకులు బ్రవేలిడి చూపుచు
వాకొనదగినట్టి వీలువాలుగనుండెన్

క॥ గుండును పేల్చకయున్నను
చండుగ తలపడెడి వైరి ధర్మము తప్పన్
గుండును వదలిన వైరికి
గండము తప్పదు రణమున కడు ఘోరముగన్

క॥ భయముగ రక్షక భటులును
దయనీయస్థితిని నేడు తడబడుచుందురే
భయమున నధిపుని యాజ్ఞను
రయమున పాటింపవలెను రక్షక భటులున్

క॥ అడ్డము పడుదురు నేతలు
గడ్డినిమెక్కెడి అధములకాయగ బరిలోన్
గ్రుడ్డిగనేతలు ద్రోహికి
అడ్డము నిలిచిన పనులకు నాయువు మూడున్

క॥ కేసులొ నిరికిన నిరుపురు
దాసులు రక్షకభటులకు ధర్మము సున్నా!
కేసులు కోర్టుకు వెళ్ళుట
వీసము సుఖముండబోదు వెతలే తప్పన్

## అధికారులు

క॥ చదువుల బడిలో కులముల
మొదలగు పేరు తొలగించి ముప్పను గూర్చెన్
తదుపరి కుల ధ్రువపత్రము
చదువుల బడివారలడుగసాగును తిప్పల్

క॥ అధికారి దయా ధర్మము
ప్రథమము కావలెను పేదబాలలకెల్లన్
అధికారుల సంతకములు
విధిగా నందింపకున్న విఘ్నము కలుగున్

క॥ ఇష్టము లేనధికారులు
కష్టసుఖంబులను గానకయెయే మేమో
నష్టములటంచు బలుకుచు
కష్టముతో తుదకు సంతకంబును చేయున్

క॥ కుదురుగ మాలగబుట్టిన
అదనముగావేరు సాక్షిదౌ వ్రాతేలా?
బదవలు బాధలుపడుచును
చదివెడి విద్యార్థి దాని జమ చేయవలెన్

క॥ ఘటికుని పదిమారులడుగ
పటుతరమగు నా కుల ధ్రువపత్రము దేవా!
పటపట పండ్లను కొఱికియు
వెటకారము జూపి పంప వేదనగలున్

క॥ మొండి అధికారి తలపడ
గండములలో గండమింక కలుగును మీదన్
గుండెను రాయిని చేసియు
మొండిగ వాదమును రేపి ముంచును బ్రతుకుల్

క॥ ఎదిగిన మాదిగ మాలలు
ముదమున క్రీస్తుని మతమును పొందిన ప్రీతిన్
భేదమును మరచి మన్నన
ముదమున కూర్తుర? దళితులు మోదముజెందన్

క॥ ప్రత్యేకించిన 'సీట్ల'ను
సత్య ప్రమాణముగనిచ్చు సరసులు గలరా!
ప్రత్యేకించిన పదవుల
సత్యపు కులముల కొసంగు సవ్యంబేనా?

క॥ ఉన్నత పదవులయందున
నున్నతముగనున్న వారలొప్పరు దీనిన్
మిన్ను విరిగి మీదపడిన
నెన్నరు 'ఎస్సీ'ల వారినే మాత్రంబున్

క॥ కుడువను కూడే లేకను
ఇడుముల పాలగు హరిజనులేవో మేలుల్
బడయుచునుండిరని మిగుల
గడుసుగమాటలు విసరగ కలతగనుండున్

క॥ పలువిధముల పలుకులములు
విలువను నెఱుగక సదా వివేకము లేకన్
విలువగు పదవులు మొత్తము
కలిగెను మాలల కటంచు కటువుగ నందుర్

క॥ ఘనమైన పదవి బొందిన
వినయుండగునొక హరిజన విజ్ఞుని చేరన్
మనసుకు నెమ్మది కలుగగ
వినయముగాను నడుగు కుల వివరంబింకన్

క॥ కులమును చెప్పిన మీదట
గలిబిలి మనసుతొ కదలును గౌరవ సఖుడున్
కులమును జెప్పగ గొంతున
వెలగను కూరిన విధమున వెలవెల బోవున్

క॥ క్షత్రియ సంతతి యిరువురు
మిత్రయు హరిజనుడుచూడ ముచ్చట దీరన్
క్షత్రియ పేరును బట్టియు
ఉత్తమ హరిజనునిగాను నొప్పదు నేతల్

క॥ మతమును మార్చుట చేతను
పెతలే మిగిలినవి దళిత పీడిత తతికిన్
మతమొక మార్గంబు గదా !
మత మేరీతిని పరపతి మలచునుపుడమిన్

క॥ ఒరిగిన దేమియు లేదిక
పరదేశీయుల మతమును పాముకొనంగన్
పరపతి మన్నన గలదా?
తరుముట నిత్యము దళితుల తలవ్రాతయ్యెన్

క॥ కులములు వద్దని చెప్పుచు
కులములు వెలసెను విరివిగ గోడును బుచ్చన్
కులముల పేరులు జెప్పుచు
విలువగు పదవులు గడింత్రు విజ్ఞులు భువిలోన్

క॥ పూర్వమ్మొకులవాడని
గర్వముచే నేకలవ్యు కారించిరిలన్
సర్వులు మెత్తురె? యిట్టివి
సర్వము సమమని పలికెరి పాగిన పెద్దల్

# కులపిచ్చి

కII దేశమునందలి ప్రముఖులు
లేశము తలపోయరాయె లేవిడి సనులన్
ఆశలు రేపెడి క్రీడలు
లేశము ముందుకు జరుగవు లీలల చేతన్

కII ఇప్పటికైనను దేశము
మెప్పును పొందగ కులమను మిత్తిని మొత్తన్
తప్పక వృద్ధిని గాంచును
తప్పును గమనించిచనిన ధన్యతగలుగున్

కII కలరే కులమున జూచిన
విలువగు మేధగలిగిన వివేకులు మిగులన్
తెలివికి విలువలనీయక
కులముకు విలువనొసంగి కూల్తురుయశమున్

క। నీచపు బుద్ధులు వీడుచు
ఆచియు తూచియునుచేయ నబ్బును జయముల్
యోచన చేసియు పెద్దలు
నీచమువీడిన ప్రజలలో నేస్తము పెరుగున్

క॥ కులములు మతముల పేరున
విలువగు పనులెన్నొ కూలె విజ్ఞత లేకన్
కులమున కిచ్చిన విలువను
విలువగు మనుజులకు నీయ వెలుతురు తుచ్ఛుల్

క॥ మతమౌఢ్యంబున దేశము
అతలాకుతలంబు జేయనల్పుల మూగన్
మతమును సాకుగ గైకొని
అతిగా దుఃఖమున ముంతురల్లరి మూకల్

క॥ ఓటును గుంజినకొందరు
చాటుగ కులముల విలువలు చాటుదు రెలమిన్
పూటకు గతిలేని ప్రజల
ఓటును దిగ మ్రింగి వేయనుంకింతురు హా

క॥ ఓటును గుంజగ మాటలు
వాటముగా నం(ద్రుగాని పలుకరు పిదపన్
మాటలు కోటలు దాటును
పూటకు భత్యా మొసగంగ పూనరు నేతల్

# అ క్రమాలు

కII పదునగు పేదల భూములు
బెదిరించి ధనికులు మ్రింగి పెరిగె దరిలలో
ఉదరము మండిన దళితులు
కదలిన భూ భుక్కులెల్ల కలుగులో దూరున్

కII దోపిడి పెరిగెను దండిగ
కాపురుషులయిరి వెరువక ఘనులున్ మునులున్
పాపపు జాతిగ మారిరి
మోపుగ దుష్క్రియ లొనర్చి పుష్కరులెల్లన్

కII నిలువున ప్రాణము దీయుచు
కలవరపరచెడి కసాయి కర్కశ జనముల్
కలిమితొ తులతూగమిగుల
విలువగు ప్రాణములుదీయ వేదన కలుగున్

కII ధనసంపాదన కొఱకై
మనుజులను హతమొనరించి మర్మాంగములన్
కొనునట్టి లేకి కమ్మెచు
ధనరాసులు కూర్చుచుంద్రు దైత్యులమూకల్

క॥ పూర్వము రాజులు దోచిరి
సర్వము నిర్దయుగ గొప్ప సంపదలెల్లన్
సర్వము మ్రింగుచునుండిరి
సర్వులు నిరుపేద హొట్ట చఱునమండన్

క॥ న్యాయము పండెను పూర్వము
న్యాయము దిగజారె నేడు పలుగురు నవ్వన్
న్యాయము మచ్చుకు దక్కదు
కయ్యములు బలిసి ప్రజలలో కఠినత పెరిగెన్

## పాలకులపోకడ

క॥ అప్పులు హెచ్చుగ జేయుచు
తిప్పలు పడనేల మిగుల దిగులుతో నేతల్
ముప్పును గూర్చెడి ఋణములు
తప్పక ముంచును ప్రజలను తప్పుల వలనన్

క॥ దొరికిన చోలని ఋణములు
బరకగసాగిరి తికమక పడకను నేతల్
పరువు ప్రతిష్టల మాటలు
మరచిరి పూర్తిగ సుఖాలు మరిగిన మీదన్

క॥ అభివృద్ధి పనులను నిలిపి
శుభములు పడయంగవచ్చు చొరవుతో నేతల్
ప్రభువుల చౌర్యము కట్టును
ప్రభుతకు భారము తొలంగి పరువులు నిల్చున్

## పార్టీలు

క॥ పదవులు పోయిన బాబులు
యెదలో బాధలు రగలగ నితడొక "పార్టీ"
అదనులో పెట్టును బెట్టుగ
బదపలు బాధలను మ్రింగి పరితాపముతోన్

క॥ కుదురుగ నిలబడి యుండక
పదవులు పోయిన దొరయిక భగ్గున అగ్నై
కదనము త్రొక్కుచు కదలును
పదునుగ తులతూగు 'పార్టీ' పంచను చేరున్

క॥ జనమును కావగ జనతా
ఘనతను పెంచగ బి.జే.పి కదలెన్ బిగువున్
మనుగడ పెంచగ సి.పి.యుం
మనుజుల వ్రాతలను మార్చు మార్గము వెదుకన్

క॥ రాజ్యము నేలగ మతమును
భోజ్యంబుగ జూపి ఓట్లు బొక్కగ జూచెన్
రాజ్యము దక్కిన నివ్విధి
అజ్యము పోసిన ప్రజలకు నల్పపు బుద్దిన్

క॥ ఢిల్లీ పీఠము నెక్కియు
ముల్లెను దిగమ్రింగి వేయు మూర్ఖత తోడన్
కల్లోలము రేపి యెదగ
ఎల్లరు తల్లడిలు చుంద్రి యేమనవలెనో

క॥ వృద్ధుల కాలము చెల్లగ
పద్దతు లన్నియును మారి బాధలు హెచ్చెన్
దుర్దశ కునీద్వ పాగిరి
అర్థము పర్దములు లేని ఆశల తోడన్

క॥ హిందూ ముస్లిము లెల్లరు
పొందుగ కాలము గడుపుచు బుద్ధిగ మెలగన్
కొందరు కూల్చి మసీదును
గందర గోళమును రేప కక్షలు పెరిగెన్

క॥ తలపడి ఏలిన ఏలిక
కలతలు లేకుండ నెట్లు కాలము గడుపున్
గలిబిలి చేయుట తగునా ?
కలతలు మానని యెడలను కలుగవు సుఖములో

## స్వార్థము

క॥ రక్షణ మంత్రిగ నెలకొని
భక్షణ చేయంగ సాగె ప్రముఖుండొకడున్
రక్షణ పదవిని మించిన
అక్షయ మైనట్టి పదవి కాశలు రేగన్

క॥ రోజులు మారుటచేతను
మోజుగ దక్కెను పదవొక మోసము రేగన్
రోజులు గలిబిలి కాగను
రాజులు చెలరేగ తుదక రాజక మాయెన్

క॥ రక్షణ కవచము తొలగెను
అక్షయ ప్రభువులకు నంతటాశలు నిండన్
రక్షణ కలవైన ప్రభువు
భక్షింప బడెను పరాయి భ్రష్టుల చేతన్

క॥ నెత్తిన చేతులు బెట్టిరి
ఉత్తము లందరును గూడి యుద్వేగముతోన్
మెత్తని పదవిని బొందగ
చిత్తము నిలిపి తెగటార్చె చెడ్డమనసుతో

క॥ నిలువున చంపిరి నీచులు
విలుకానికి చిక్కుపక్షి విధమున సకటా!
కలవరమొందెను దేశము
తులువలు సాగించినట్టి తుచ్ఛపు పనికిన్

క॥ ఇందిర తల్లిని బట్టియు
చిందర వందరగజేసి చీల్చిరి సిక్కుల్
బంధము కలిగిన మూర్ఖుడు
డెందము కుందగను కాల్చి ఢీకొనె చావున్

క॥ యుద్ధపు భూమిగ గుడిలో
శుద్ధియు బద్ధమును లేక శోధన కూర్చన్
పద్ధతి చొప్పున తలపడ
శుద్ధ పరాభవము కలిగె చోద్యము జెందన్

క॥ అన్నము పెట్టిన తల్లిని
దున్నలు తెగబడి వధింత్రె ధూర్తత్వమునన్
ఎన్నడు కానని వింతలు
మిన్నగ చెలరేగిపోయె మిగులన్

క॥ మతమను పిచ్చిని రేపియు
మతమూలిన పనులు సల్ప మహనీయులిలన్
మతమును మించిన మందిక
కుతలంబున లేదటంచు కూర్చిరి నీతుల్

## వీరులు

క॥ అటముబాంబుల ధాటికి
నేటి ప్రపంచము దిగులుతొ నిండియు నుండన్
అటము బాంబుల యుద్ధవృత్తి
బీటలు వారెను మిఖేలు విజ్ఞత తోడన్

క॥ భారతదేశము వర్ధిల
వీరులు పోరక విజయము పేరు ప్రతిష్టల్
ధారుణియందున కలుగవు
వీరజవానులను మించు వీరులు గలరా ?

క॥ ఎముకలు కొఱికెడి చలిలో
కుములుచు మృగరాజులుండు కోనలలోనన్
నిముసము రెప్పను వాల్చక
విముఖత జూపకను కాయు వీరులు హద్దుల్

## నాడు-నేడు-కంట్రాక్టర్ల తీరు

క॥ చల్లని అంగ్లేయులు కో
కొల్లగ భవనములు కట్టి కూర్చిరి ఘనతల్
లొల్లుడు పనులకు దూరము
చల్లగ మనుచుండె వారి చక్కని చేతల్

క॥ పట్టుమని నాల్గు రోజులె
కట్టిన కట్టడములుండి కాలము చెల్లున్
ఇట్టివి భారత ప్రజలకు
పెట్టిన విద్యలుగ వెలసె బిడియము లేకన్

క॥ ఇదియేనా ? మన పోకడ
ఇదియేనా మన ప్రగతికి నిమ్ములు గూర్చున్
హృదిలో రేగవ మంటలు
తుదకేమౌనో మనగతి తోచకయుండెన్

- జై హింద్ -

## అముద్రిత గ్రంథములు

1. అంప్రవరస్పృశము (నవల)
2. తీర్పు (నాటకము)
3. బడిపంతులు (నాటిక)
4. నేటిన్యాయము ,,
5. ఉత్తమదేశభక్తుడు ,,
6. ఎస్తాచరిత్ర ,,
7. భక్త ఎలీషా ,,
8. మన రాజ్యాంగము (బుఱ్ఱకథ)

## అముద్రకమునకు సిద్ధముగానున్న గ్రంథములు

| | | |
|---|---|---|
| 1. | యోసేపు చరిత్ర (నాటకము) | 10-00 |
| 2. | పితృప్రేమ ,, | 8-00 |
| 3. | తలవని పెళ్ళి (సాం ,, ) | 12-00 |
| 4. | ముక్తిప్రదాత వచనము | 8-00 |
| 5. | శ్రీ లాల్‌బహదూర్‌శాస్త్రిగారు | 6-00 |
| 6. | ధూమపానము (పద్యకావ్యము) | 6-00 |
| 7. | క్రీస్తు జయంతి (నాటిక) | 15-00 |

---

ప్రతులకు :

పిడపర్తి ఎజ్రాకవి

బోస్‌నగర్, తెనాలి — 522 201.